శ్రీరస్తు.

శ్రీమతే రామానుజాయనమః.

# శ్రీభగవద్రామానుజయతీంద్రులు (ఉడయవరులు) తమశిష్యులకుఁ బరమార్థముకొఱకు ఉపదేశించిన డెబ్బదినాలుగువార్తలు.

అను నిది పూర్వాచార్య కృత గ్రంథములనుండి
సంగ్రహించి,

శ్రీమాన్ వింజమూరి వీరరాఘవాచార్యులగారిచేఁ
తెలుగునఁ గూర్పఁబడినది.

ఇందుతోఁగూడా. షడ్వార్తలును చేర్పఁబడినవి.

ఈ రెండును బాపట్లలో

మ.రా.రా.శ్రీ. కొమ్మూరి పుల్లయ్యగారి స్వకీయ
శ్రీకన్యకాపరమేశ్వరీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె.

| | | | |
|---|---|---|---|
| దీని వెల పుస్తకము—1 కి | ... | 0—1—0 | |
| 12 కి | ... | 0—10—0 | |
| 100 కి | ... | 4—4—0 | |

1910.

౪. విధి నిషేధములయందు కేవల సామాన్య శాస్త్రము ప్రమాణముగా యుండకూడదు. విశేష శాస్త్రములయి వద్విషయములందు నాసక్తిగలిగి యుండవలయును

౫. ఆచార్యకృపచేత జ్ఞానోత్పత్తియైన తర్వాత శబ్దాది విషయములయం దాసక్తుడు కాఁగూడదు.

౬. శబ్దాది విషయముల నన్నిటిని విసర్జనమందు సమానముగానే చూచుచుండవలయు.

౭. సుగంధములయిన పుష్ప చందన తాంబూలాదులయందు వాసనారుచి కార్యముల నెప్పుడును జేయఁగూడదు.

౮. భగవన్నామకీర్తనలయందు ఏప్రేమగలిగి భక్తిపారవశ్యము గలుగునో యాయానందమే భగవద్భక్తుల కీర్తనలయందు నుండవలయును.

౯. మహా భాగవతుల నాశ్రయించుట భగవత్ప్రాప్తికి గారణమని దృఢముగా తెలిసికొని యట్టిమహా భాగవతుల యాజ్ఞయం దుండవలయును.

౧౦. విష్ణుకైంకర్యమును శ్రీవైష్ణవ కైంకర్యమును విడిచివేసి రాగద్వేషాది కార్యములలో జిక్కియుండెనేని యట్టివాఁడు ప్రాజ్ఞుఁడయినను నశిం

చును. అనగా పుణ్యలోకములు లేక నరకములు పాలగు ననుట.

౧౧. శ్రీవైష్ణవు లాచరించు ననుష్ఠానము హే యముగా గైకొనకయు పేయముగా స్వీకరింపవలయును, దానియందు విశ్వాస ముండవలయును.

౧౨. మహాభాగవతులయిన జనులను ఏకవచన ముగా బిలువంగూడదు. బహువచనముగా దేవరవారు అను మొదలయిన మాటలతో ముచ్చటించవలయునని భావము.

౧౩. శ్రీవైష్ణవుల దర్శనము కాగానే ముందు గా దాను వందనము చేయవలయును.

౧౪. కోవెలలో శ్రీస్వామివారి వైపునకును శ్రీ వైష్ణవులు కూర్చుండి యుండగా వారివైపునకును తన కాలు చాచుకొని కూర్చుండగూడదు.

౧౫. భగవంతుని యాలయము వైపునకును శ్రీ వైష్ణవుల తిరుమాళికలవైపునకును పాదములు సాచుకొని పడుకొని నిద్రింపగూడదు.

౧౬. నిద్రబోయి లేచినతర్వాత గురుపరంపరా ను నంధానము చేయవలసినది. (తెల్లవారునప్పుడు ప

డక పిడిచితెచ్చియున్న పిగానుండి చేయక(అనగాగింజగాపా
చనుపంబులన్ జేసినపిమ్మట గుణుపరంపరనను న ధింపవ
లయునని తాత్పర్యము).

౧౭. మహాభాగవతులు కూర్చుండి యుండగా
గాని విష్ణుసన్నిధియందుగాని ధ్యానానుసంధానము చే
యుచు ప్రణామమును సమర్పింపవలయును.

౧౮. భగవత్కీర్తనమునుగాని శ్రీవైష్ణవ చరిత
మునుగాని యనుసంధించుచుండగా వెళ్ళినవాడా కథ
పూర్తియగునంతకు నచటనుండి కథాశేషమునువిని యా
ట్టివారిని సత్కరించవలయును. మధ్యకాలమందు లేచి
పోవుట యపచార మగుచున్నది.

౧౯. శ్రీవైష్ణవు లెవ్వరేని తన గ్రామమునకు
(తన గృహమునకయినను) వచ్చుచున్నారని తెలిసినతో
డనే వారి కభిముఖముగా వెళ్ళి వారికి వందనం బొనర్చి
తోడ్తెచ్చి సత్కరించి వారు తిరుగా వెళ్ళునప్పుడు కొం
తదవ్వేగి యనుయాత్రంబు నొందవలయును. ఈరెండు
ను చేయనియెడల మహాదోషము గలుగుచున్నది.

౨౦. దేహయాత్రనిమిత్త మెల్లప్పుడును శ్రీవై
ష్ణవులగు మహాత్ముల నాశ్రయింపక ప్రాకృతుల యిం

టింటికి దిగుచు నాగ్నాగ వేలణను ఆదరముతో నుచ్చ
రించుచు తన పేరునకు ముందుగా నుంచుకొని శ్రీవైష్ణవ
నియమములు మానుకొని యుండుట శ్రీవైష్ణవ స్వరూప
మునకు హానిప్రదము.

౨౧. శ్రీవిష్ణువుల యాలయములు దర్శనగోచ
రములు కాగానే దూరమునుండియే వానికివందనంబులో
సగ్పివలయును.

౨౨. దేవతాంతరాలయము జూచి విస్మయ
వాక్యములం బలుకకూడదు. వానికి వందనముచేయకూ
డదు. దేవతాంతర కీర్తనమును జేయగూడదు.

౨౩. విష్ణువుయొక్క గాని శ్రీవైష్ణవులయినవారి
యొక్క గాని నామసంకీర్తనముచేయుచుండగా విని సం
తోషింపకపోయినను అట్టివారి నపహాస్యముచేసినను భా
గవతాపచారము సంభవించుననుట నిశ్చయము.

౨౪. శ్రీవైష్ణవులెవ్వరైన నెండలోగాని వెన్నె
లలోగాని నిల్చుండగా వారిదేహచ్ఛాయ ప్రసరించిన
చోట నానీడను దాటగూడదు సరేకదా తనదేహచ్ఛా
యను వారిమీదుగా ప్రసరించునట్లు నడువకూడదు.

౨౫. ముందుగా ప్రాకృతులను స్పృశించిన సి

సప్పుట శ్రీవైష్ణవులను స్పర్శింపగూడదు.

౨౬. ఏ వైష్ణవులైనను తనకు మున్ముందుగ వందనము చేసినయెడల తానును వందనము చేయవలెనుగాని వారి ననాదరించి దరిద్రుడుగదాయని యూరకుండరాదు.

౨౭. ఏ శ్రీవైష్ణవులైనను దాసోహమ్మని వచించుచు దండవత్ప్రణామమాచరించనేని యట్టివారిననాదరించినట్లైన మహాపాతకము సంభవించును.

౨౮. శ్రీవైష్ణవుని యొక్క యనాచారముగాని నిద్రగాని మాంద్యముగాని జన్మమునుగాని చూచినవా రెట్టివాని నితరులకు వెల్లడిపడునట్లుచ్చరింపగూడదు.

౨౯. శ్రీవైష్ణవులయందుగల దోషముల నుగ్గడింపక వారిగుణములనే వెల్లడిచేయవలెను.

౩౦. పెరుమాళ్ళతీర్థమునుగాని శ్రీభాగవతశ్రీపాదతీర్థమునుగాని ప్రాకృతజనులు చూచుచుండగా నుజ్జీవింపగూడదు.

౩౧. తత్త్వత్రయ రహస్యత్రయముల యొక్క జ్ఞానము లేనివారైన శ్రీవైష్ణవుల యొక్క శ్రీపాదపాదతీర్థము నుజ్జీవింపగూడదు.

ఇచ్చట జ్ఞానమనగా సంప్రదాయము తెలిసియుం

డినంబాలను ప్రతిపదార్థముగా పదక్రమముగా కం ఠపాఠమపేక్షింపక జనదని గ్రహించునది. గ్రంథము ప ఠింపగలశక్తిని నపేక్షించి వయోవృద్ధులను బాలురపహా సింపరాదని భావము.

౩౨. జ్ఞానానుష్ఠానయుక్తులై సదాచారరతులు నైన శ్రీవైష్ణవులయొక్క తిరువడిగళుల తీర్థమును నిత్యము ను ప్రయత్నపూర్వకముగా నుజ్జీవింపవలయును.

౩౩. శ్రీ ఎంబెరుమానారుల విషయమై అందరిభా గవతోత్తములతో సామ్యమునుంచక భగవద్బుద్ధిను చి సేవింపవలయును.

౩౪. ప్రమాదవశముగా ప్రాకృతుల సంస్పర్శత గలినట్లైన యప్పుడు సచేలస్నానముచేసి శ్రీవైష్ణవశ్రీ పాదతీర్థము నుజ్జీవింపవలయును.

౩౫. జ్ఞానవైరాగ్య భక్త్యాదులుగలిగి మహాను భావులైన శ్రీవైష్ణవోత్తములంగనినప్పుడు వారిని పరమ పవిత్రవిగ్రహులనుగా నెంచియట్టిమహాత్ములయందధిక వి శ్వాసముంచవలయును.

౩౬. ప్రాకృతులయిన్యందు సాలగ్రామతీర్థ మైనను బుచ్చుకొనగూడదు.

౩౭. విష్ణ్వాలయములు ప్రాకృతాలయములయ్యేనేని యందలివిష్ణుమూర్తులంగూడ జూడగూడదు.

౩౮. దివ్యదేశములగు శ్రీవిష్ణుమందిరములందు ప్రాకృతులుచూచుచున్నను తీర్థప్రసాదములు స్వీకరించుటకు సంశయము పడవలదు.

౩౯. స్వామివారిసన్నిధిని శ్రీవైష్ణవులచేత నివ్వబడినప్రసాదమును తానుపవాసవ్రతములు గలవాడనని పుచ్చుకొనకయుండగూడదు.

౪౦. పరమపావనమైన విష్ణుప్రసాదమందు నెప్పుడును నుచ్ఛిష్టబుద్ధిని నిలుపగూడదు.

౪౧. శ్రీవైష్ణవుల సన్నిధియందు తనగుణములను దానుకీర్తింపగూడదు.

౪౨. శ్రీవైష్ణవుల సాన్నిధ్యమందు ఇతరులనైనను బరిభవింపరాదు.

౪౨. భగవంతునియొక్కయు భాగవతోత్తములయొక్కయు గుణానుభవ కైంకర్యమును చేయకమునుపు యితరకార్యములను జేయరాదు.

౪౩. దినమునందొక గడియసేపైన స్వాచార్యస్తుతిని సలుపవలయును.

౪౪. దినమునకొకగడియయైనను శ్రీ శఠగోపుల వారి ప్రబంధములను ననుసంధింపవలయును.

౪౫. దేహాభిమానముగలవారితో సహవాసము చేయగూడదు.

౪౬. శ్రీవైష్ణవచిహ్నలు ధరించియు విషయాతురులైవంచనచేయు జనులతో సహవాసమును జేయగూడదు.

౪౭ పరదూషణ తత్పరులయిన వారితో సంభాషింపగూడదు.

౪౮. దేవతాంతరభక్తులయినవారితో కలిసమాట్లాడుట సంభవించెనేని తద్దోష పరిహారార్థము మహానుభావులైన శ్రీవైష్ణవులతో సంభాషింపవలయును.

౪౯. పరమభాగవతోత్తములను దూషించునట్టి మనుజాధములనుజూడగూడదు.

౫౦. స్వాచార్యులవిషయమై యపచారమొనరించు క్రూరులవంక చూడనైనగూడదు.

౫౧. ద్వయైకనిష్ఠగలవారితో నెల్లప్పుడు సహవాసముగలిగించుకొనవలయును.

౫౨. ఉపాయాంతర నిష్ఠులయిన వారిసహవాసమును వర్జింపవలెను. ప్రపత్తిధర్మనిరతులైనవారితో

నెప్పుడునుఁ సేవలయును.

౫౩. రహస్యత్రయ సారజ్ఞులై తత్త్వత్రయజ్ఞానము గల శ్రీవైష్ణవుల వెంట దిరుగవలయును.

౫౪. అర్థకామపరులతో నెప్పుడును, నివసింపగూడదు.

౫౫. భగవద్భక్తినిష్ఠులతో నెల్లప్పుడును సంభాషణ చేయవలయును.

౫౬. ఏశ్రీవైష్ణవులయినను నీకపకారము చేసిగేని వారియందు నీవపకారస్మృతి నుంచక మౌనముగా నుండవలయును.

౫౭. ఏవైష్ణవున కయినను పరమపదప్రాప్తియందు బుద్ధి కుదిరెనేని అనగా బరమపదింప సిద్ధుడయ్యెనేని సమస్తమయిన శ్రీవైష్ణవులునువారికి హితమాచరింపవలయును.

౫౮. ధర్మవిరుద్ధమయిన కర్మవలన మహాలాభము గలిగినను దానిని సేవింపగూడదు. అట్టిది ఎప్పటికిని తనకు హితమయినది కాజాలదు.

౫౯. భగవన్నివేదితముకాని యన్నాదికము నెవ్వరును భుజింపరాదు.

౬౦. పుష్ప చందన తాంబూలాదులను హారిక గ్రహణము చేయనిది వానిని శ్రీవైష్ణవుఁడు ధరింపరాదు.

౬౧. అర్థకామాది హేతువులచేత సాధనాంతరములవలన సంప్రాప్తమయిన వస్తువులు తన కయాచితముగా వచ్చినను బరిగ్రహింపరాదు.

౬౨. జాతిదుష్టా శ్రయదుష్ట భావదుష్టములు గాని యన్నాదికమును భుజింపవలయును. భగవన్నివేదిత మనుదాని ననువర్తించుకొనవలయును.

౬౨. జాతి దుష్టము లనగా "నకళం జంభక్షయేత్" ననురాంపిబేత్" ఇత్యాది నిషిద్ధ వస్తువులు. ఆశ్రియ దుష్టము లనగా అపవిత్రస్థలమందున్న శాకాదులును చండాలాదులవలన నానీతములయిన దధిదుగ్ధఘృతాదులును, భావదుష్టములనఁగా మాంసాదులనుఖండించురీతిగ నితరవస్తువులను ఖండించుట. ఇట్టు త్రివిధదుష్టములుగాని వస్తువులను భగవన్నివేదితముచేసినపిమ్మట భుజింపవలయునని తాత్పర్యము.

౬౩. తన దేహమునకు బ్రియమయిన భోగములను పరమాత్మకొరకు నివేదింపగూడదు.

౬౪. శాస్త్రీయములయిన సమస్త భోగములను

షిష్ణుసమర్పణము చేయవలయును.

౬౫. విష్ణ్వర్పితములయిన అన్న, పానీయ, భ క్ష్యాదులయందు ప్రసాదబుద్ధిని జేయవలయును గాని భోగబుద్ధిని జేయగూడదు. (భక్ష్యమనగా ముద్గాన్న దధ్యన్న శర్కరాన్నాది చిత్రాన్నములు.

౬౬. శాస్త్రీయమైన కార్యములనైనను భగవత్కైంకర్యబుద్ధితో జేయవలయును. (శ్రుతిస్మృతుల వలన జేయు శ్రౌతస్మార్తకర్మలన్నియు "శ్రుతిస్మృతీ మమైవాజ్ఞా" ఇత్యాది భగవద్వచనమునలన భగవదాజ్ఞాకైంకర్యములని భావము.

౬౭. మంత్రత్రయార్థనిష్ఠులయిన మహాభాగవతుల కపచారముచేయుటకంటె నాత్మనాశనకరమగునది వేఱొకటి లేదు.

౬౮. మంత్రత్రయార్థనిష్ఠులయినవారి ముఖోల్లాసముకంటె మోక్షకారణమయినదియు మఱియొకటి లేదు అనగా విష్ణుభక్తులగు మహాత్ములను బూజించుట వలన మోక్షముగలుగుననియు నట్టి శ్రీవైష్ణవుల నవమానించుటవలన నరకహేతువనియు దాత్పర్యము.

౬౯. అర్చావతారవిగ్రహసమాధియందున్న వి

ష్ణువునందు శిలాసామాన్యబుద్ధి యుంచకూడదు. పరమ పదనాథుం డంతర్యామియైయున్నట్లు తెలంచవలయును.

౨౦. స్వాచార్యులయందు అందరినరులతో బాటు నరుడని బుద్ధియుంచగూడదు. ఇకనేమనగా "ఆచార్య స్సహరిస్సాక్షాత్" అను న్యాయముగా భగవంతుడనిబుద్ధియుంచవలెను.

౨౧. శ్రీవైష్ణవులందు జాతిబుద్ధి నిలుపగూడదు కుడి, శాఖ, భేదము లక్కరపెట్టుకొనక సర్వజనులునైకకంఠ్యముగా నేకపంక్తిని భుజించుచు దేహసంబంధాదులంగీకరింపవచ్చును. ఇందువలన చాతుర్వర్ణ్య సాంకర్యమక్కరలేదు, విష్ణ్వర్పిత ప్రసాదపాత్రుడై వచ్చినయే జాతి శ్రీవైష్ణవునిని దిరస్కరింపక జాతినినిర్ణయుంచక ఏకపంక్తియందు ప్రసాదము నివ్వవలయునని తాత్పర్యము.

౨౨. శ్రీపాదతీర్థమందుగాని పెరుమాళ్ళ తీర్థమునందుగాని సామాన్యోదకబుద్ధి నుంచక యమృతప్రాయముగానెంచి పరమాదరముతో నాస్వాదింపవలయును

౨౩. సకలకలుషములను బోగొట్టునట్టి సకలఫలసిద్ధమైన శ్రీమూలమంత్రమునందు విభక్తి ప్రత్యయములు గలిగి వ్యాకరణానుశిష్టమైన శబ్దములలో నొకటి

యని శబ్దసామాన్యబుద్ధి యుంచకూడదు. మహావిశ్వాసము గలిగి పరదైవతముగా నెన్నవలెను.

౭౮. సర్వేశ్వరేశ్వరుడయిన శ్రియఃపతిని బ్రహ్మరుద్రాదిత్యాది దేవతలతోపాటుగా నిశ్చయించుకొనక దేవదేవోత్తమునిగా సృష్టిస్థితిలయకర్తనుగా నెంచవలయును. అటు నెంచనివాడు నరకపాతుడగును.

ఈయన్నివార్తలయొక్కయు ఫలిత మెట్టిదనగా.

శ్లో. శ్రీమద్భాగవతార్చనంభగవతఃపూజావిధేరుత్తమం
శ్రీవిష్ణోరవమాననాద్గురుతరం శ్రీవైష్ణవోల్లంఘనం
తీర్థాదచ్యుతపాదజాదుకుతరం తీర్థం తదీయాంఘ్రిజం
తస్మాన్నిత్యమతంద్రితోభవసతాం తేషాఁసమారాధనే.

మఱియు షడ్వార్తలు.

శ్లో॥ శ్రీభాష్యంద్రవిడాగమప్రవచనం శ్రీశస్థలేష్వన్వహం
కైంకర్యంయదుశైలనిత్యవసతిస్సార్థద్వయోచ్చారణం
యద్వాభాగవతాభిమానవసతిః శ్రీయస్సతామిత్యలం
శిష్యార్ప్రహాయతీశ్వరఃపదమగాద్విష్ణోఃపదంశాశ్వతం

౧. శ్రీభాష్యప్రవచనము ఆదిచేయలేనివారికి.
౨. ద్రావిడ ప్రబంధ ప్రవచనము. ”
3. దివ్యదేశములందలి దేవాలయము

లయందు కైంకర్యము. "

౪. యదుశైలక్షేత్రమందునిత్యనివాసము "

౫. అర్థసహితముగ ద్వయానుసంధానము"

౬. ఒక శ్రీభాగవతోత్తములగు శ్రీవైష్ణవుల యభిమానము గలచోట యుండుట.

ఇంతకుమించి యిక సిద్ధియును లేదని శ్రీభాష్యకారులవా రానతిచ్చిరి.

శ్రీమతే రామానుజాయ నమః

---

